శ్రీరస్తు.

# కు మా ర శ త క ము.



క. శ్రీజానకీశ్వరునకును
జేజేలన్ భక్తిసలిపి ♦ చిత్తం బలరన్
నే జెప్పుదు కొన్ని నీతుల
నీ జగమున బాలకులకు ♦ నెలమి కుమారా. 1

:—:తల్లి దండ్రులపై భక్తి:—:

క. ప్రొద్దుబొడువకను నిత్యము
నిద్దురమేల్కొనుము నీవు ♦ నియమితపనులన్
శ్రద్ధయు నొనరిచి పదపడి
ముద్దుగ తలి దండ్రులకును ♦ మ్రొక్కు కుమారా. 2

క. తల్లియె నీకిల దైవము
తల్లియె యారయగ కల్ప ♦ తరువీ మహిలోన్
తల్లియె కనకపుగని యా
తల్లిని గొల్వంగవలయు ♦ దయను కుమారా. 3

క. నీకై నోములనోచెను;
నీకై వ్రతములను జేసె; నీకై ధరణిన్
లోకైక పూజ్యుగొలిచెను
పాకటముగ నీదు తల్లి ♦ బాలకుమారా. 4

కుమారశతకము.

క. తొమ్మిది మాసంబులు, గ
ర్భమ్మున నిను మోచి గనియె ♦ పరమప్రీతిన్
ఇమ్మహి నీ సుఖదుఃఖము
లెమ్మెయి నారయుచు జనని ♦ హితసుకుమారా.

క, అప్పటినుండియు మోదము
నుప్పతిలందల్లి నిన్ను ♦ యోదార్చుచు, నె
ల్లప్పుడు కౌగిలి వీడక
నిప్పుడమిని ప్రేమబెంచె ♦ నెఱుగుకుమారా. 6

క. చన్నిచ్చి నీళ్ళుబోసియు,
కన్నారగ చిన్నిచేత ♦ గాంచియుతొట్లన్
మన్ననవిడి జోకొట్టియు
నిన్నశిశువుబెంచె తల్లి ♦ నిజము కుమారా. 7

క. చిన్నితనమ్మున నీకై
యెన్నగశక్యంబు గాని ♦ యిడుమలబడి, నిన్
మన్ననల సాకి పెంచెను;
యన్నా! నీతల్లియామె ♦ నరయుకుమారా. 8

క. కడుపరసి యన్నమిడియెను;
ఒడలరయుచు నీళ్ళుబోసె ♦ యోపికతోడన్
బడలికనుదీర్చె; తల్లికి
పుడమిని యీడెవరు? తలపు ♦ ముద్దుకుమారా. 9

క. చలిజ్వరముల కనుబాధల
తలనొప్పుల నీవు యడల ♦ తల్లియుఁగుందెన్
ఇలనీ కన్నను హెచ్చుగ
తలపుము రా దీని మదిని ♦ ధాత్రికుమారా. 10

క. ఎన్నివిధాలఁగ సాకియు
నిన్నింతగఁ జేసె తల్లి ♦ నిక్కము గనుమా
మన్ననల నామె నరయుచు
పున్నెంబుల గట్టికొనుము ♦ పుడమికుమారా. 11

క. పుట్టిన యాదిగఁ దండ్రియు
నట్టన సుఖదుఃఖమరసి ♦ నెయ్యంబున, నిన్
గొట్టక తిట్టక వలసిన
పుట్టంబుల గట్టనిచ్చె ♦ ముద్దుకుమారా. 12

క. పెట్టఁగ భూషణముల నీ
కెట్టెటో కష్టంబులంది ♦ యిలదెచ్చెను, నా
పట్టియటంచును ప్రీతితో
దిట్టంబుగ యతనిఁ గొల్వు ♦ ధీసుకుమారా. 13

క. వలసిన తినుబండములను,
వలసిన టోపీషరాయి ♦ వాహనముల, నా
టలకై పీపీలను, బం
తులనారసి దెచ్చిపెట్టె ♦ ముద్దుకుమారా. 14

కం. అంగళ్ళయందు దొరికెడి
రంగుల బొమ్మలను మరియు ♦ గరముల, బొ
బొంగరముల, గోలీలను,
యుంగరములనీకు దెచ్చె ♦ నర్వికుమారా 15

కం. చదివిన చతురుండగునని
చదివించను దినముఁ బాఠ ♦ శాలకనుపుదుక్
ఎదివలసిన నద్దానిని
మది దెలియుచు దెచ్చియిచ్చు ♦ మంచికుమారా. 16

కం. పలకలను, పుస్తకంబుల
బలపంబుల కాగితముల ♦ వ్రాయుంగను, పె
న్సిలులన్ దెచ్చియొసంగను
కులదీపకుఁడంచుఁదండ్రి ♦ కూర్మికుమారా. 17

కం. 'నాకొడుకు చతురుఁడగునని'
యేకొఱతయు లేకనతము ♦ నింపుదలిర్పన్
నీకొఱకు ద్రవ్యమెంతయొ
ప్రాకటముగ ఖర్చుపెట్టు ♦ బాలకుమారా. 18

కం. ఇట్టి తలిదండ్రులారయ
పుట్టించిన దేవుకన్న ♦ భువి పెద్దలు, నీ
వట్టెటులాడక వారిని,
నెట్టన సేవింపుము క్తి ♦ నిజముకుమారా 19

క. ముది ముది వయసునవారలు
మదనముఁ జలిచేత పదము బడుగిడలేకన్
కదలుచునుండఁగ, నిన్నే
మదినమ్ముక యుంద్రిగాడ ♦ మంచికుమారా. 20

క. కనుగానక, విననేరక
తనువున సత్త్వంబులేక ♦ కంపించుదరిన్
అనువున సంపాదించియు
వినువారిని సాకవలయు ♦ ప్రియసుకుమారా. 21

క. ముక్కాలిముదుసళ్ళుల, నీ
సక్కజముగ సేవజేసి ♦ యవనిఋణంబున్
చిక్కనయంతగ దీర్పుము ;
చక్కగనీకబ్బుముక్తి ♦ సత్తుకుమారా. 22

క. మునుకౌశికుఁడను విప్రుఁడు
జనివనమున కందుతపసు ♦ నల్పియు మోక్షం
బును బొంద జాలడయ్యెను ;
మనమున జననీ జనకుల ♦ మఱచె ! కుమారా. 23

క. తుది యింటికేగి యాతఁడు
మదిలో సద్భక్తిఁదలఁచి ♦ మమతతో వారిన్
కుదురుగ సేవించెను; నీ
వదియొదలఁచి గొల్వువారి ♦ నార్యకుమారా. 24

## సోదర సోదరీప్రేమ.

క. ఒక్క కడుపునను బుట్టితి
రొక్క మృదుల తల్పమందు • నుండితిరరయన్
రొక్క చనుబాల బెఱిగితి;
రొక్క గృహమునను మెలగితి • రుర్విఁగుమారా. 25

క. ఆటల పాటల మీరలు
పాటవమునఁగూడి యెపుడు • బాల్యమునందున్
నీటున కాలము జననీ
వీటున గడపితిరి ; ప్రేమ • వెలయకుమారా. 26

క. అప్పటి సౌహృదయంబుల
నప్పటి సుప్రేమములను • నౌదార్యములన్
ఇప్పటి కప్పుడె మఱువగ
నెప్పాటను నర్హమౌనె? • ఇలనుకుమారా. 27

క. పుట్టగ పుడమిని సోదరు
లట్టిట్టుగ గడచిపోవ • నగుదురు శత్రుల్
నెట్టన యను సామెతలకు
గట్టిగ గురియగుచునుంద్రె! • ధాత్రికుమారా. 28

క. పుడమిని పుట్టుటయాదిగ
మడియుట వఱకీరు స్నేహ • భావము మెఱయన్
నడువవలె; యఖిలపనులను
గడవఱకును జేయవలెను • కనుముకుమారా. 29

క. జగడముల సేయవలవదు
జగతిన్ సోదరులతోడ; • జననీ జనకుల్
మిగులన్ గుందఁగ జేయకు
నగు బాట్లకు పాలుగాకు • నమ్రకుమారా. 30

క. అక్కల చెల్లెల యెడలను
మక్కువతో మెలఁగుచుండ • మేదినివారల్
ఎక్కువ కాలము నీకడ
నిక్కముగా నిలువరయ్య • నీతికుమారా. 31

క. కొన్నాళ్ళకు సిరి కలిగిన
చిన్నియనుఁగు సోదరులను • క్షితి మఱువక, నీ
యున్న తెఱగెఱిగి వారల
మన్నించుచు నుండుమిదియె • మతముకుమారా. 32

క. సోదరులతో వైరంబులు
మేదిని వహియింపవలదు; • భేదము లేకన్
బ్రోదిగ వారిని జూడుము
సాదరమున నా దరించి • నతముకుమారా. 33

క. ధరసంగీభావంబున
కరమరుదుగ మీరు మెలఁగ • ధాత్రీస్థలిలోన్
పెరవారు మిమ్ము జెనకరు;
త్వరలో కార్యంబులగును • బాలకుమారా. 34

## విద్యాభ్యాసము.

క. వేకువనె లేవవలయును
ప్రాకటముగ దంతములెల్ల ♦ భద్రముసల్పన్
నాకాలంబునకిల, మరి
యేకాలము సాటిరాదు ; ♦ యెఱుగుకుమారా. 35

క. బడిలోన సద్దుచేయక
జడమతివై, బుద్ధిగల్గి ♦ చెప్పిన పాఠం
బిడువక వల్లించుము ; నీ
కడరు శుభావళులు ధాత్రి ♦ నార్యకుమారా. 36

క. బలపముల పుస్తకంబుల
నిలసతతము పాడుజేసి ♦ యెప్పుడు యింటన్
తలిదండ్రుల వేధింపకు
మలిగిన కొట్టుదురువార ♦ లవని కుమారా. 37

క. ఇచ్చినవస్తువులన్నిటి
మెచ్చుగ భద్రంబుజేసి ♦ మించిన ప్రీతిన్
హెచ్చరిక వాడవలయును
విచ్చలవిడివేయవలదు ; వినుముకుమారా. 38

క. పంతులు బడిలేకుండిన
నింతయు దలపకను పాఠ ♦ మేమఱకుండన్
సంతసమున వల్లించుము ;
మంతనమున గురుఁడు మెచ్చు; మహిని కుమారా. 39

## కు మా ర శ త క ము.

క. అల్లరి పిల్లలఁ గూడుచు
నల్లరి సల్పకుము ; నోరి ♦ కల్లన బుద్ధిన్
జెల్లముగఁ జెప్పి, గురువుల
నుల్లంబున నొచ్చ నాడకు ; ముద్దు కుమారా. 40

క. సహపాఠకులతో స్నేహము
మహినించుచు నీకుఁగాని ♦ బాలావళులన్
యహరహము గలిసికొంచును
సహనమునఁ బరించవలయు ♦ జక్కఁ కుమారా. 41

క. ఉదయమున లేచి దేవుని
మదినెన్నఁగవలయు నీవు ♦ మానితభక్తిన్
ముదమలర తోడిబాలుర
సదయత జూడంగ నొప్పు ♦ సతము కుమారా. 42

### మంచిగుణములు.

క. దొంగతనంబులు సేయకు;
వెంగలివై వారుగనిన ♦ విడువరు నిన్నున్
రంగుగ యనుమానింతురు
సంగతివిడి చెదరుతోడి ♦ సఖులు కుమారా. 43

క. బడిలోన తోడిబాలురు
విడిచిన వస్తువులవేని ♦ వెసదాచకు, ని
న్నడిగిన సత్యము జెప్పుము
నుడువకు చెడుభాషణముల ♦ యుర్వికుమారా. 44

క. జగడముల నేయబోకుము
మొగతాళికినైన టక్కులెప్పుడాడకు ♦ ఈ
జ్జగమున వెలసిన వెలఁగుచు,
సుగుణంబుల నేర్వవలయు ♦ శూరకుమారా. 45

క. దారుల నరిగెడి జంతుల
కారుణ్యము లేశమైన ♦ గల్గక వాలన్
బారగ ద్రోలకు ! నీకది
ధారుణి బాపంబుదెచ్చు । తప్పుకుమారా. 46

క. గిల్లిన కొట్టిన తిట్టిన
యుల్లంబది తల్లడిల్లు ♦ నుర్విస్థలినీ
వల్లన దెలియుచు దీనిని
చల్లగ ప్రాణులనుజూడు ♦ సతము కుమారా. 47

క. బీదల సాదల జూచిన
నాదరమున వారిజూడు ♦ నలుగక ప్రేమన్
వేదనున సాయమొనరిచి
వేదనలను దీర్పజూడు ♦ వినుము కుమారా. 48

క. కష్టములు కలిగినప్పుడు
ఇష్టముతో పరగవలయు ♦ నేకాలమునన్
కష్టములు పడ్డవరులే
శిష్టులు ధరదీని వినుము ♦ చిన్నికుమారా. 49

క. ధనవంతుల బిడ్డలుధర
దినుసాటినిజూచి వాని ♦ దినగోరకు ; వా
రనయము గట్టెడిబట్టల
మనమునగట్టంగమాను ♦ మహినికుమారా. 50

క. సజ్జన్నము, కొఱ్ఱన్నము
గొజ్జన్నము, లేక వృత్తి ♦ కూడో, నేదో
మజ్జిగయొ, త్రాగిధరనీ
బొజ్జను నిండించి తృప్తి ♦ పొందుకుమారా. 51

క. సోమరివై పగటుల, యం
దేమఱచియున్న నిద్ర ♦ నిద్దరయందున్
బ్రేమమునబోకు మభ్యా
సమయిన వీడంగరాదు ♦ జగతికుమారా. 52

క. పని చొఱనవతగ్గు; దేహం
బనవరతము భారమౌను ♦ హర్షంబడగున్
కనుచూపు మాంద్యమౌ; పగ
టినిద్రమిగుల వెతలకును ♦ తావికుమారా. 53

క. సత్సహవాసము జేయుము
యుత్సాహము సద్గుణంబు ♦ లోర్పును సిరియున్
కుత్సితములు లేకునికియు
వత్సా! నీకడరుచుండు ♦ వసుధకుమారా. 54

క. సిగరెట్లను బీడీలను
పొగచుట్టలను వాడవలదు ♦ బుద్ధియు చెడునె
మ్మొగమున కళ పీడంగను
జగతిన్ నగుచుందురెల్ల ♦ జనులు కుమారా. 55

## ఆరోగ్యభాగ్యము.

క. హితమగు నాహారంబుల
మితముగ భుజియింపు మెపుడు; ♦ మించిన ప్రీతిన్
సతతము పండినపండ్లను
క్షితినిన్ భక్షింపుమేలు ♦ చిన్ని కుమారా. 56

క. రోగములు ప్రబలుచుండిన
క్రాగిన నీరంబు ద్రావు ♦ రాత్రిని సతమున్
బాగుపడు నీదు దేహము
జాగులు నేయంగవచ్చు ♦ జ్వరము కుమారా. 57

క. గాలియె ప్రాణాధారము
గాలియె లేకున్న జంతు ♦ గణమునశించున్
మేలయిన వాయువెప్పుడు
చాలగ బీల్వంగవలయు ♦ జగతికుమారా. 58

క. పడకగది తలుపులెప్పుడు
విడువగ జనురాత్రులందు ♦ విడువకయున్నన్
చెడిపోయి యున్న వాయువు
కడునిడుముల దెచ్చిపెట్టు ♦ కనుముకుమారా. 59

క. ప్రతిదినము స్నానమొనరిచి
యతిశుభ్రముగాగనీవు ♦ వసనముల తెల్లన్
సతతము యుంచుము; తైలము
ప్రతివారము శిరమునఁబెట్టు ♦ మంచికుమారా. 60

క. నీతోడుగు బట్టలన్నిటి
ప్రతిదినమును చక్కఁజేసి ♦ మలినము లేకన్
సతతము ధరియించుము; ధర
నుతిమంతుడ వంద్రు నిన్ను ♦ మంచికుమారా. 61

క. చల్లని ప్రొద్దుల నెప్పుడు
పిల్లలతో పలువిధాల ♦ ప్రియమగు యాటల్
యుల్లము హర్షము జెందగ
మెల్లన నాడంగవలయు ♦ మేలుకుమారా. 62

క. నిద్దుర రాత్రులయందుల
శ్రద్ధయునొసగింపవలయు ♦ దగినంతగ, నీ
కద్దియె బలమొసఁగును ; మా
నిద్దుర చెడ, రోగమబ్బు ♦ నిజము కుమారా. 63

## దైవభక్తి.

క. ఎండనొసంగను సూర్యుని
దండిగ వెన్నెల నొసంగ ♦ దగ చంద్రుని, నీ
కుండగ భూమిని దేవుఁడు
నిండుదయను నీకొసంగె ♦ నిజముకుమారా. 64

క. రాత్రుల గగనంబందున
చిత్రముగా ఋక్షములను ♦ చిత్రించుచు, మా
నేత్రముల కమితహర్షము
ధాత్రనియొసరించు ; దేవు ♦ దలపుకుమారా. 65

క. చల్లని పవనంబును ధర
వెల్లనవీవంగఁ జేసి ♦ మేలగు హర్షం
బల్లనహొసఁగుచును ధాత్రిని
మెల్లఁ బోషించు ; ఘనుని ♦ మొక్కుకుమారా. 66

క. శుకపికశారిక నికరము
రకరకములగీతములను ♦ శ్రావ్యముగాగన్
సుకముగ వినుపించును న
మ్మకముగ; దేవు ♦ బొగడవలెనుగా ! కుమారా. 67

క. ఫలములకై తరుగుంపుల
జలములకై మేఘములను ♦ శక్కనిక్షీరం
బులకై గోవులవితతిని
ఇలనీకొరకై సృజించె ♦ నెలమి కుమారా. 68

క. తియ్యని జలముల దప్పికి
నెయ్యంబున తీపుపండ్ల ♦ నీయాకలికిఁ
జయ్యనసిద్ధంబుగయొ
య్యొయ్యెడలను బెట్టెనీకు ♦ నెలమి కుమారా. 69

క. పలురకముల ధాన్యంబుల
పొలములఁ బండింపఁ జేసి ♦ ప్రోదిగ నీయా
కలికిలనుంచెను దేవుఁడు;
తలఁపుము గా యతని సతము ♦ దయను కుమారా. 70

క. అరటుల, మామిడిఫలముల, యం
జూరములను, పనసద్రాక్ష ♦ జొంపంబుల, ని
ద్ధరఁ గలుగఁ జేసె నీశ్వరు
సరియెవ్వరు ? యతని గొలువు ♦ జగతి కుమారా. 71

క. మల్లెలు, జాజులు, గోజులు
మొల్లలు సంపంగులాది ♦ పుష్పావళులన్
సల్లలితంబుగ తరులను
గొల్లగ సృజియించె దేవు ♦ గొలువు కుమారా. 72

క. నేత్రానందకరంబౌ
చిత్ర విచిత్ర కుసుమముల ♦ చిన్నెలువన్నెల్
చిత్రములౌ పులుగుల, నీ
ధాత్రిని సృజియించె దేవు ♦ తలఁపు కుమారా. 73

క. తమ్ములనన్నల సఖులను
యమ్మలనాయనను చిన్ని ♦ యక్కలనీకున్
ఇమ్ముగ నొసఁగెను దేవుఁడు
నెమ్మనమున యతనిగొలువు ; నీవు కుమారా. 74

క. తెలియని విషయంబుల ధర
తెలిపింపగ జక్కగాను ♦ తెలిసినవారిఁ
ఇల నీకొరకై పంపుచు
తెలివిని రాజిల్లఁజేయు ♦ తెలియు కుమారా. 75

క. ప్రతిఫలమాసింపక, స
న్మతితో సౌఖ్యంబులొసగి ♦ మనుచున్నపుడున్
హితమతియరయుచునుండుము
సతతము నీశ్వరుని గొలువు ♦ జగతి కుమారా. 76

క. నిద్దురఁ జెందెడివేళల
నెద్దియు బాధింపకుండ ♦ యింపుదలిర్పన్
ముద్దుగ నీశ్వరు మనమున
తద్దయు ధ్యానింపవలయు ♦ ధరణికుమారా. 77

క. ఈశ్వరు గొలిచినవారికి
విశ్వంబున యతడొసంగు ♦ వివిధార్థములన్
శాశ్వతమౌయానందము
విశ్వాసముతోడ; దీని ♦ వినుము కుమారా. 78

## గురుభక్తి.

క. అజ్ఞానమనెడి తిమిరము
విజ్ఞానంబనెడి జ్యోతి ♦ వెలిదోలి ధరన్
సుజ్ఞానబోధ సలిపియు
ప్రజ్ఞాన్వితుఁజేయు గురువు ♦ బాలకుమారా. 79

ధర జేయుట కాదుసుమా!
పరిపూర్ణపు చిత్తశుద్ధి ♦ భాగ్యకుమారా. 35

కం. గురువులయెడ సద్భావము,
కరమను రాగంబు ప్రీతి ♦ గౌరవములు, స
ద్ధర ప్రేమాతిశయంబులు,
మఱియాదలు నేర్పవలయు ♦ మంచికుమారా. 36

కం. గురువులకడ వినయంబున
ధరమొలఁగుచు భక్తితో స ♦ తంబును వారికిఁ
కరమాదరించ వలయును
విరసంబులు పల్కఁజనదు ♦ వినుము కుమారా. 37

కం. తగువేషము తగు పలుకులు
తగువినయము భక్తిమరియు ♦ తగు కనికరమున్
తగు భూతదయయు ధాత్రిని
తగుదగురాసికి ; చిహ్న ♦ తనయకుమారా. 38

కం. తనకన్నను తెలిసిన వా
రనుచును గురువులఁ దలఁచి, య ♦ హంభావములన్
మనమున నిడి, విద్యల నే
ర్చిన లెస్సగ బట్టువడును ♦ క్షితిని కుమారా. 39

కం. నీకున్ దెలియనిదానిన్
ప్రాకటముగ జెప్పనేర్చు ♦ వరగురు జెలిమిన్
యాకలిగొని నేర్పవలెను ; న
మ్మకముగ చతురుండవగుదు ♦ మంచికుమారా. 40

